**Meri baat Gourse Suno**
**(Telugu)**

# ఒక చిన్నమాట

మూలం
**జైనబ్ గజాలీ**

అనువాదం
**ఫరీదున్నీసా**

# నా మాట శ్రద్ధగా వినండి

నేను ఒక ముఖ్యమైన అంశంపై నా అభిప్రాయాన్ని తెలియపరచడానికి ప్రయత్నిస్తున్నాను. 'సత్సమాజ నిర్మాణంలో స్త్రీ పాత్ర ఏవిధంగా ఉండాలి' అని నన్నడగడం జరిగింది. ఇది అతి ముఖ్యమైన అంశం కూడా.

ప్రస్తుతం సమాజ నిర్మాణంలో విశ్వాసి అయిన (ముస్లిం) మహిళ పాత్ర ఏమైనా ఉందా? ప్రశ్న ఇదే అయితే సమాధానం కూడా ఇందులోనే ఉంది. అంతేకాదు మహిళ ఉనికే ఒక అద్భుతం. ఎందుకంటే మానవ మనుగడకు పునాది స్త్రీ. ఆడ మగ అనే రెండు జాతులను తన గర్భం నుంచి జన్మనిస్తుంది. అంతేకాదు శిశువు ఆలనాపాలనా చూస్తుంది. నా ఉద్దేశం ఏమిటంటే, ఆ సృష్టికర్త అయిన దైవం ఓ సున్నితమైన ప్రాణాన్ని తన మహిమ ద్వారా తల్లి గర్భంలో నిక్షిప్తపరుస్తాడు. ఆ శిశువుకు అన్ని అవయవాలను ఏర్పాటు చేసి సంపూర్ణ శిశువుగా తల్లి గర్భం నుంచి ఈ ప్రపంచంలోకి తెస్తాడు. ఆ తర్వాత ఆ శిశువు పోషణ, శిక్షణ వంటి బాధ్యతలను స్త్రీకు అప్పజెప్పాడు. దైవం మానవ సృష్టి గురించి ఇలా సెలవిచ్చాడు.

> **"మేము మానవుణ్ణి మట్టి సారంతో సృష్టించాము, తరువాత అతనిని ఒక సురక్షితమైన స్థానంలో పడే బిందువుగా మార్చాము. ఆ తర్వాత ఆ బిందువుకు ముద్ద ఆకారాన్ని ఇచ్చాము, ఆపై ముద్దను కండగా చేశాము, తరువాత మాంసపు కండను ఎముకలుగా చేశాము, ఆతర్వాత ఎముకలకు మాంసాన్ని తొడిగాము, ఆపైన దానిని భిన్నమైన సృష్టిగా చేసి నిలబెట్టాము. కనుక అల్లాహ్ ఎంతో శుభప్రదుడు, సృజనకారులందరిలోకెల్లా ఉత్తమ సృజనకారుడు.' (అల్‌మోమినూన్ : 12-16)**

శిశువు తల్లి గర్భం నుంచి బయటికి వస్తుంది. అంటే తల్లి ఒక బిడ్డకు జన్మనిచ్చి ఈ ప్రపంచానికి అందిస్తుంది. అంతటితో ఆమె బాధ్యత పూర్తవుతుందా?

ఆ తరువాత ఆ బిడ్డను పెంచి, పోషించే బాధ్యత తల్లి తీసుకోదా? అహర్నిశలు కష్టపడి పాలుపట్టి తన బిడ్డను పెంచి పోషించదా?

పాలు పట్టే వరకే శిశువుపై తల్లి బాధ్యత ఉంటుందా లేక పాలు మాన్పించడంతోపాటే ఆమె బాధ్యత పూర్తవుతుందా?

విషయం ఏమిటంటే, ముస్లిం మహిళ బాధ్యత ఎంతో సున్నితమైనది. తను నిర్వహిస్తున్న ప్రత్యేక విధులతో ఆమె సమాజంలో అత్యున్నత స్థానంలో ఉంది.

స్త్రీ భావితరాలకు క్రమశిక్షణ నేర్పిస్తుంది. మొట్టమొదట, శిశువు పెరుగుదలకు తోడ్పడుతుంది. శిశువును ఓ చక్కటి మనిషిగా తీర్చిదిద్దుతుంది. ఆ స్త్రీయే మానవులలో విభిన్న జాతులైన మగ కానివ్వండి, ఆడ కానివ్వండి వారిరువురి అభ్యున్నతి కొరకు ఎన్నో త్యాగాలు చేస్తుంది. వారిలో సద్గుణాలు, నీతి, నిజాయితీ, సహనశీలత, గొప్ప త్యాగనిరతిని పెంపొందించడంలో కృషి చేస్తుంది. అందుకే సమాజంలో స్త్రీ పాత్ర దేహంలో ప్రాణం లాంటిది. స్త్రీయే మానవ సమాజానికి మాతృమూర్తి, కేంద్రబిందువు. స్త్రీయే సమాజ నిర్మాణాన్ని చేపడుతుంది. ఇంకా ఆమె సామాజిక జీవితానికి ప్రాణం పోస్తుంది. వాస్తవంగా చెప్పాలంటే స్త్రీ ద్వారానే మానవ సమాజంలో సుఖశాంతులు వెల్లివిరుస్తాయి. ఆమె తలచుకుంటే మానవ సమాజాన్ని పెడదోవపట్టించగలదు లేదా వినాశనానికి గురిచెయ్యగలదు.

మనిషికి జన్మనివ్వడం, మనుగడ కల్పించడం లాంటి బాధ్యతలను స్త్రీ తన భుజస్కందాలపై నిలుపుకున్నది. తద్వారానే ఈ జగతిలో జీవం, కదలికల ఉత్పన్నం జరుగుతున్నది. అయితే ఇక్కడ ఉత్పన్నమయ్యే ప్రశ్న ఏమిటంటే,

ఇన్ని బాధ్యతలను చేపడుతున్నప్పటికీ ఆమె వద్ద ఇంకా సమయం మిగిలే అవకాశం ఉందా? పురుషులతో సమానంగా పోటీపడుతూ కార్యాలయాల్లో, వ్యాపార, ఆర్థిక రంగాల్లో పనిచేసే తీరిక ఆమెకుందా?

అతి ముఖ్యమైన విషయం ఏమిటంటే, ఏ పురుషునితోనైతే మహిళ సమానత్వం పొందాలనే ధ్యేయంతో ఆరాటపడుతున్నదో ఆ వ్యక్తి (ఆ పురుషుడు) ఎవరు? ఆ పురుషుడు ఆమె గర్భం నుంచి జన్మించి, తన ఒడిలో పెరిగిన ఆమె ముద్దు బిడ్డ కాదా? తన ముద్దుల సుపుత్రుడు దేశాధిపతిగా లేదా దేశ మంత్రిగా తన బాధ్యతలను చేపట్టడంలో స్త్రీకు ఇందులో ఎదురయ్యే సమస్యలు ఏమిటి?

ఆ ముద్దుల సుపుత్రుడు ప్రతి శుభోదయం తన మాతృమూర్తి హస్తాలను చుంబించడం కోసం ఆమె వద్దకు రాడా? మీరే ఆలోచించండి. ఈ స్థానం మహోన్నతమైనదా? ఆమెతోపాటు పనిచేసే పురుషులను ఆనందపరచడానికి ప్రతిరోజు ఉదయం ముప్పావు గంటకంటే ఎక్కువ సమయం అద్దం ముందు నిలబడి సింగారించుకోవడం గొప్పదా?

ఇస్లాం తన దృష్టిలో మహిళ స్థానాన్ని ఈవిధంగా తెలుపుతుంది. 'తల్లి పాదాల కింద స్వర్గం ఉంది.' మహిళ దీనికంటే ఉత్తమమైంది. ఆమె తన అమూల్య సమయాన్ని భర్త సేవల్లో గడుపుతుంది. ఆమె స్వభావంరీత్యా ఆమె చేసే పనులు భర్త కోసం ప్రత్యేకించబడ్డాయి.

నిస్సందేహంగా పురుషుడు తనపై మోపబడిన బాధ్యతల్ని నిర్వర్తించాలి. స్త్రీ జీవిత కర్తవ్యం ఏమిటంటే, ఏ బాధ్యత అయితే ఆమెపై మోపబడిందో ఆ బాధ్యతను నిర్వర్తించవలెను ఎందుకంటే ఆ బాధ్యతలను ఆమె తప్ప మరొకరు నిర్వర్తించలేరు.

ఆ సృష్టికర్త అయిన దైవం మానవ సంతతిని ఏ ధర్మంపై సృష్టించాడో అది ప్రకృతి సిద్ధమైన ధర్మం. కాబట్టి పురుషుడు కుటుంబ పెద్ద, పోషకుడు.

ఇంకా పురుషుని కర్తవ్యం ఏమిటంటే, అతడు స్త్రీ జీవనం కొరకు కావలసిన సామాగ్రిని ఏర్పాటు చేయాలి. ఆమె అవసరాలను సమకూర్చాలి. అలాగే స్త్రీ తన సహజ స్వభావాల రీత్యా మాతృమూర్తి. కనుక ఆమె తన ద్వారా సంతానాన్ని వృద్ధి చేయడం, తన సంతానాన్ని సుశిక్షుతులుగా తీర్చిదిద్దడం ఆమె విధి. భార్య కర్తవ్యం ఏమిటంటే, ఆమె తన భర్త కొరకు ప్రశాంతమైన వాతావరణాన్ని ఏర్పరచాలి. తద్వారా పురుషుడు బయటి ప్రపంచంలోకి అడుగుపెట్టి తన పనిని ప్రశాంతంగా పూర్తిచేయగలగాలి. అప్పుడే పురుషుడు అన్నిరంగాల్లో వృద్ధీ వికాసాలను పొందగలుగుతాడు.

ఈ జీవిత పయనంలో స్త్రీ కర్తవ్యం పురుషులను, స్త్రీలను పెంపొం దించడం. పురుషుడు స్త్రీకు ప్రశాంతత, సుఖసంతోషాలు కలిగించే వస్తు సామాగ్రిని ఏర్పాటు చేయాలి. తద్వారా ఆమె సహజ శ్రేయస్సు కొరకు ఉత్తమ మైన మానవ సమాజాన్ని తయారు చేయగలదు. ఎందుకంటే ఈ వాస్తవాల సమక్షంలో కూడా సమాజ నిర్మాణంలో స్త్రీ పాత్ర ఏమైనా ఉందా? అనే ప్రశ్న తలెత్తే అవకాశముందా? వాస్తవంగా స్త్రీ తన జీవితంలో ఓ తల్లిగా, ఓ గుణ వంతురాలైన భార్యగా తన బాధ్యతలను నిర్వర్తిస్తుంది. కాని నేడు సమాజంలో జరుగుతున్నది ఏమిటి? స్త్రీ ఈ రెండు మహోన్నతమైన పాత్రలను సక్రమంగా పోషించగలుగుతున్నదా?

నా ఉద్దేశమేమిటంటే, స్త్రీకు తన సహజసిద్ధ స్వభావానికి విరుద్ధమైన పనులు అప్పగిస్తున్నారు. మరి దాని పరిణామం ఎలా ఉంటుంది?

స్త్రీ తన సహజ కర్తవ్యాన్ని విస్మరించడం వల్ల నేడు సమాజంలో ఎటువంటి సంతతి వృద్ధిలోకి వస్తుందంటే, వారు బుద్ధిహీనులుగా తయారవు తున్నారు. వారు మత్తును కలిగించే పదార్థాలను వినియోగించి నిర్వీర్యమవు తున్నారు. వారు మనుషుల రూపంలో ఉన్న మృగాలుగా తయారవుతున్నారు. వారు ఏమాత్రం మానవత్వంలేని వింత జీవుల్లా మారుతున్నారు.

నేడు మనం తల్లి మమతను కొన్ని తాత్కాలిక ప్రయోజనాల కొరకు

అమ్మివేశాము. ఇంకా స్వయంగా సమాజంలో స్త్రీ పాత్ర ఏమైనా ఉందా? అని మనమే ప్రశ్నిస్తున్నాము. మీరు ఏ సమాజం గురించి ప్రశ్నిస్తున్నారు? ఇంకా సమాజం ఎక్కడ మిగిలి ఉందని? మనం స్త్రీలం. ఇంటిని, మన సహజ బాధ్యతలను విస్మరించాం. కాని ఇంటి సంస్కరణే సమాజ సంస్కరణలో మొట్టమొదటి మెట్టు. నేడు మనం స్త్రీని ఇంటి నుండి వ్యాపార రంగంలోకి, వ్యాపార రంగం నుండి ఇంటికి ఇలా రెండేసి బాధ్యతలను ఆమెకు అంటగట్టి ఆమె సహజ స్వభావాన్ని ఆమెలోని వివేకాన్ని వ్యర్థపరిచాము. దాని పర్యవసానం ఏం జరుగుతుందంటే సమాజంలో ఎటుచూసినా వినాశనం, విచ్ఛిన్నం చోటుచేసుకుంటున్నాయి.

పాశ్చాత్య సంస్కృతి ఏమంటుందంటే, మేము స్త్రీకు స్వేచ్ఛను ఇచ్చా మనే అబద్ధపు మోసపూరిత వాదన చేస్తుంది. ఈ సమాజం అసలు యదార్థం తెలుసుకునే సమయం ఆసన్నమయింది. అప్పుడు సమాజానికి సమాజంలోని సమస్తానికి తన అసలు స్వభావం వైపునకు పయనించడం తప్ప మరోదారి కనిపించదు. అప్పుడు కాని (వారికి) మనకు అర్థం కాదు. మనమే మన ఇంటిని, ఇంటితోపాటు మన సమస్త కార్యకలాపాలను (పాశ్చాత్య సంస్కృతి) వినాశనపు కోరల్లో బందించామని. పాశ్చాత్య సంస్కృతిలో స్త్రీ తానే స్వయంగా తన ఆర్థిక అవసరాలను, ఆహార సామాగ్రిని ఏర్పాటు చేసుకోవడం కోసం కష్టపడి పనిచేసి సంపాదించుకోవాలి. దాని పర్యవసానం ఏం జరుగుతుందంటే స్త్రీ, స్త్రీతత్వాన్ని కోల్పోతుంది.

(కాబట్టి) మహిళా ప్రధానమంత్రి అయ్యే స్థానానికి ఎదిగిపోయిందని మీరు మోసపోకండి. వాస్తవంగా మహిళ స్థానం అనిర్వచనీయమైనది. ఆమె కర్తవ్యం ఏమిటంటే, ఆమె తన సంతానాన్ని సుశిక్షుతులుగా మలచడం, వారిని ఉత్తమమైన నాయకులుగా తీర్చిదిద్దడం. అదే సమాజాన్ని సాఫల్యబాటలో ముందుకు నడిపించడంలో తోడ్పాటును కలిగిస్తుంది.

స్త్రీ తల్లిగా ఎప్పటివరకైతే తన బాధ్యతలను (సక్రమంగా) నెరవేరు

స్తుందో అప్పుడే సమాజంలో ఆమెకు గౌరవనీయమైన స్థానం లభిస్తుంది. ఇప్పుడు మనం ఆ విషయాన్ని గురించి పరిశీలిద్దాం. మహిళను ఇంటి (సంస్క రణ) నుంచి పరిశ్రమలలోకి, వ్యాపార రంగంలోకి తీసుకెళ్ళిన ఫలితంగా మనం ఏం కోల్పోయాం, మనం ఏం సాధించాం.

స్త్రీ కొన్ని తాత్కాలిక ప్రయోజనాల కోసం తన కర్తవ్యాన్ని విస్మరించింది. తద్వారా తమ సంతానాన్ని వినాశనానికి గురి చేసింది. ఆ సంతతి ఆలనాపాలనా అనేది నైతికతకు విరుద్ధంగా జరిగి వారు పెద్దవారయ్యారు. దాని పర్యవసానమే నేడు సమాజంలో భయంకరమైన రాక్షస సమాజం వృద్ధిలోకి వచ్చింది. ఆ సమాజ జీవనం క్షీణదశకు చేరుకుంది. ఇప్పుడు ఆ సంతానమే తమ తల్లిని నీచమైన దృష్టితో చూస్తూ అసహ్యించుకుంటుంది. తమ తల్లి ఆజ్ఞను పాలించకపోగా ఆమె మాటను పెడచెవిన పెడుతుంది.

దీనంతటికి కారణం, వారు శైశవదశలో ఉన్నప్పుడు వారి అమాయక చూపులు కూడా చూడకుండా వారి తల్లి వారిని చైల్డ్‌కేర్ సెంటర్ (శిశు సంరక్షణ కేంద్రం)లలో వదిలి వెళ్ళిపోయేది. చైల్డ్‌కేర్ సెంటర్ వారికి ఆ శిశువు పట్ల ఎటువంటి ఆసక్తి ఉండేది కాదు. ఇంకా యవ్వన దశకు చేరుకున్న ఆ సంతానం మనసులలో ఈ మాట నాటుకుపోతుంది. అదేమిటంటే, తమ తల్లికి తమకన్నా తాత్కాలిక ప్రయోజనాలే మక్కువ అని. తమ సంరక్షణను లేదా తమపై దృష్టిసారించడం అనేది ఓ అమర్యాద అని తమ తల్లి భావించేదని. విచిత్రం ఏమిటంటే స్వయంగా ఇన్ని సాక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని కూడా సంఘ సంస్కరణలోని స్త్రీ పాత్ర ఉందా అని? మనం ప్రశ్నిస్తుంటాం.

స్త్రీ పాత్ర సంఘ సంస్కరణయే. సమాజం కోసం స్త్రీ పురుషులను సన్నద్ధం చేయడం. ఓ శక్తివంతమైన జాతిని నిర్మించాలి. వారిలో ధైర్యం, ఆత్మవిశ్వాసం వంటి లక్షణాల్ని ప్రతి తల్లి వారి జీవితంలోని తొలి శ్వాసలోనే, మమతానురాగాలతో, విశ్వాస పూరితమైన (నిష్కల్మషమైన) శాంతియుతమైన మాటలతో తల్లి ఒడిలో ఉన్నప్పుడే వారికి బోధించాలి. దాని ఫలితం

విడిచిపెట్టకూడదు. పుత్రుడు యవ్వనంలోకి అడుగుపెట్టినప్పటికీ అతను పెద్దపెద్ద వ్యవహారాల్లోనూ తన తల్లికి విధేయుడని రుజువవ్వాలి. తల్లి ఆజ్ఞతో ప్రతి చెడును కూడా విడనాడాలి. ఆ ఉత్తమ సంతానం తమ వివేకాన్ని మత్తుపదార్థాల విషపుకోరల్లో, తన భావాలను సిగార్ పొగలో, మత్తుపానీయాల చుక్కల్లోనూ కలపకూడదు. అందుకు భిన్నంగా వారు తమ తల్లి బోధించిన మాటల ద్వారా తమ జీవితాలను సుఖప్రదం చేసుకుంటారు. ఆమె ఏ నమ్మకంతో బోధిస్తుందంటే ఆ బోధనలే వారి జీవితాలలో ఉత్పన్నమయ్యే ప్రతి సమస్యకు పరిష్కారమార్గాలవుతాయి. ఆమె బోధించిన బోధనలలో తనయుల మేలు, సాఫల్యం దాగివుందనే అచంచల విశ్వాసంతో కూడుకున్నవిగా ఉంటాయి. ఇప్పుడు అదే అమ్మ మంచి చెడులకు తేడాలను తెలిపి వారిని (చెడునుంచి) రక్షణ కల్పిస్తుంది.

కాబట్టి పాఠకులారా! మనం ఈ విషయాన్ని జ్ఞప్తిలో ఉంచుకోవాలి. అదేమిటంటే, ముస్లిం మహిళ ప్రథమ, ద్వితీయ, తృతీయ అంటే తొలినుండి తుది వరకు ఒకటే. అది ఓ ఉత్తమమైన సంతతిని వృద్ధిలోకి తీసుకురావడం. (ఓ ఉత్తమ సంతతి నిర్మాణాన్ని చేపట్టడం) అది మన విశ్వాసాల్లో పటిష్ట మైనదిగా ఉండాలి. ఇస్లాం మౌలిక విషయాల్ని బుద్ధిమంతురాలైన తల్లి ఒడి నుంచే నేర్చుకుంటాడు.

"ప్రవక్త(స) ఇలా ప్రవచించారు : ఖురైష్ మహిళలు మహిళలలోకెల్లా ఉత్తములు. ఎందుకంటే, వారు గుర్రపు స్వారీ చేస్తారు. తమ సంతానం పట్ల ఎక్కువ ప్రేమానురాగాలు కలిగి ఉంటారు. తమ భర్తల ఆస్తిపాస్తులను సంరక్షిస్తారు.'

తమ సంతాన సంరక్షణ, తన భర్త సేవ చేయడం లాంటి చైతన్యవంత మైన, ప్రభావవంతమైన పనుల వల్ల సరైన భావాలు, బుద్ధివివేకాలు గల మానవ సమాజ నిర్మాణం జరుగుతుంది. (ఎప్పుడైతే స్త్రీ తన నిజ కర్తవ్యాన్ని గుర్తించగలుగుతుందో అప్పుడే ఈ సమాజ స్థాపనకు పునాది అవుతుంది.)

దైవం తన గ్రంథంలో ఇలా సెలవిచ్చాడు.

"నిశ్చయంగా ముస్లిములూ, విశ్వాసులూ, విధేయులూ, నిజాయితీ పరులూ, సహనశీలురూ, అల్లాహ్ ముందు వినమ్రులయ్యేవారూ, దానధర్మాలు చేసేవారూ, ఉపవాసం ఉండేవారూ, తమ మర్మాంగాలను కాపాడుకునేవారూ, అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించేవారూ అయిన స్త్రీ పురుషుల నిమిత్తం అల్లాహ్ క్షమాభిక్షను, గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధపరిచి ఉంచాడు." (అహ్‌జాబ్ : 35)

మగువలారా! ఇవి ఆ సలక్షణాలు. ఈ సలక్షణాలు స్త్రీ పురుషులిరువురిలో సంపూర్తిగా నిక్షిప్తమై ఉండడం ఎంతో అత్యావశ్యకం. ఈ లక్షణాలు స్త్రీలో పొందగలిగినప్పుడే ఆమె ఓ ఉత్తమమైన, బలవర్ధకమైన సమాజాన్ని స్థాపించగలుగుతుంది. వారు ఆ హక్కులను సంరక్షించడమనేదే దైవం తరఫు నుండి వారిపై విధించబడింది.

ఈ లక్షణాలను కలిగి ఉండడం పురుషులకు ఎంత అవసరమో స్త్రీలు కూడా ఈ సులక్షణాలు కలిగి ఉండడం అంతే అవసరం. ఎందుకంటే వాస్తవంగా స్త్రీయే విశ్వాస జ్యోతితో కూడుకున్న ఇస్లామీయ జీవితానికి మూల కేంద్రం. ఇస్లామీయ జీవన విధానాన్ని అనుసరించడం వల్లనే మానవుడు తన ఉనికి ద్వారానే కుటుంబ, సమాజ, జాతి వ్యవహారాలను, పరిస్థితులను చక్కదిద్దగలడని రుజువు చేయగలడు.

నిస్సందేహంగా ముస్లిం మహిళలో విశ్వాసం, విధేయత, నిజాయితి, సహనం అల్లాహ్ ముందు వినమ్రతతో తలవంచడం, దానధర్మాలు చేయడం, ఉపవాసం పాటించడం, తమ శీలాన్ని కాపాడుకోవడం, అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించడం వంటి లక్షణాలు ఏవిధంగా పొందగలగాలంటే, ఆమె ఆ లక్షణాలను తనలో నిక్షిప్తపరచాలి. వాటిని అనువర్తించవలెను, అనుకరించవలెను. తన పట్ల, ఇతరుల పట్ల అదే వైఖరిని అవలంభించవలెను. ఇటువంటి లక్షణాలు కలిగిన ముస్లిం మహిళ ఆవశ్యకత ఇస్లామీయ సమాజంలో చాలా అవసరం.

ఇటువంటి మహిళల ద్వారానే ఇస్లామీయ సమాజం ఆ కాలంనాటి పుణ్య పురుషుల జీవితాల మాదిరిగా, ప్రవక్త(స) అనుచర సమాజంగా ఎదగగలుగుతుంది. దానిలో స్త్రీ తన జ్ఞానం, నిష్ఠ ద్వారా పురుషుల పటిష్టమైన క్షేత్రాలను తయారు చేయడం ద్వారా హిజ్రీ శకం 15వ సంవత్సరంలో ఇస్లామీయ సామ్రాజ్యం వైపునకు మరలా పయనించగలుగుతుంది. కేవలం అల్లాహ్ ప్రసన్నత కోసమే ప్రేమ, సోదరభావం గల విశాల సమాజం ఏర్పడు తుంది. అప్పుడే ఆ సమాజం వృద్ధిలోకి రావడానికి దోహదపడుతుంది. ఆ సమాజంలో పురుషుల విజయం స్త్రీల సహాయ సహకారాలతో వారి హృదయా లలో నిక్షిప్తమై ఉంటాయి. అప్పుడు అవి సువిశాలమైన ఇస్లామీయ సామ్రాజ్యం అనిపించుకోగలుగుతుంది. అప్పుడే అది కారుణ్యమూర్తి ప్రవక్త(స) కాలం నాటి ఇస్లామీయ సామ్రాజ్యంగా కొత్త పుంతలు తొక్కగలుగుతుంది. కేవలం స్త్రీ ద్వారానే ఇస్లామీయ సమాజం వృద్ధిలోకి రాగలుగుతుంది. ఇస్లామీయ జీవితం జీవం, ఇస్లామీయ ఉద్యమం వృద్ధిలోకి రావడం ద్వారానే (సమాజంలో) చాలా వరకు చెడు దూరం అవుతుంది. నేడు ఈ సమాజానికి ఓ ఉత్తమమైన తల్లి కరువైనది. దైవం తనపై (తల్లిపై) విధించిన కర్తవ్యాలను గుర్తించి ఓ కొత్త సంతతిని వృద్ధిలోకి తీసుకోవడమనే బాధ్యత ఆమెపై మోపబడింది. ఈ కారణం చేతనే నేను ఈ మాట అంటున్నాను. ఈరోజు ముస్లిం మగువపై ఏదైతే బాధ్యత విధించబడిందో దాన్ని నిర్వర్తించడమనేది ఓ సున్నితమైన అంశం. మహిళ తన సహజ కర్తవ్యాలను నిర్వర్తించడమనేది ఎంతో అత్యవసరమే కాదు ఎంతో ప్రాముఖ్యం కూడా. (ఆవశ్యం కూడా) నేడు ఈ సమాజంలో ముస్లిం మహిళ ఏవిధంగా తన జీవితాన్ని గడుపుతుందంటే ఆమె జీవితంలో ఇస్లాం చిహ్నాలు, లక్షణాలు తగ్గుముఖం పడుతున్నాయి. మహిళ బాధ్యత ఏమిటంటే, కొత్త పుంతలతో ఆ సమాజాన్ని వృద్ధిలోకి తీసుకురావాలి. ఏదైతే ప్రవక్త(స) కాలంనాటి సమాజం, ప్రవక్త(స) అనుచరుల కాలంనాటి సమాజం, తాబయీన్ కాలంనాటి సమాజాన్ని ఆ సమాజాల్లో ముస్లిం

మహిళలు మాదిరిగానే వారు కూడా తమ కర్తవ్యాలను నిర్వర్తించాలి. సమస్త ఇస్లామీయ సమాజం తన సహజ స్థితిని కోల్పోవడానికి మహిళయే దానికి కారణం, బాధ్యురాలు. నిస్సందేహంగా మహిళపై విధించబడిన బాధ్యత అత్యంత సున్నితమైనది, మిక్కిలి కష్టతరమైనది కూడా. అయితే ఈ బాధ్యతను నిర్వర్తించడం కోసం దృఢ సంకల్పం, నిరంతర కృషి అత్యంత ఆవశ్యం. ఇదంతా దైవప్రవస్నత కోసమే మహిళ నిర్వర్తించగలుగుతుంది. దైవం తాను కోరుకుంటే మహిళ ఈ ప్రయత్నాన్ని మన్నించుగాక. ఆమెలోని లోపాల కారణంగా ఇస్లామీయ సమాజంలో ఉత్పన్నమయ్యే సమస్యల వల్ల కలిగిన వినాశాన్ని దైవం మన్నించుగాక. ఇస్లామీయ సమాజంలో ఈ లజ్జాపూరితమైన చెడు సంస్కృతి, దురదృష్టకరమైన స్థితి ఎందుకు వచ్చిందంటే మహిళపై ఆమె ధర్మం, ఇస్లామీయ సమాజం విధించిన నిబంధనల నుండి ఆమెకు స్వేచ్ఛగా వదిలిపెట్టడం జరిగింది.

ఇస్లాం స్త్రీను ఇంటి నుంచి బయటికి వెళ్ళి పనిచేయడాన్ని నిషేధించ లేదు. అలా అని తన సంపాదనను తానే సంపాదించుకోవడాన్ని అత్యవసరం చేయనూలేదు. ఆమె నిర్వర్తించే పని అంతకంటే మహోన్నతమైనది. మహిళ అసలు కర్తవ్యం (పని) సంతతిని వృద్ధిపరచడం, నవ సమాజ నిర్మాణం కోసం సన్నద్ధం చేయడం, ఈ కారణం చేతనే ఇస్లాం స్త్రీ సమస్త అవసరాలను, ఆమె జీవనం కోసం కావాల్సిన సామాగ్రిని ఏర్పాటు చేసే బాధ్యతను పురుషునిపై మోపింది. స్త్రీ తన కుటుంబాన్ని గాని, తన సంతానాన్ని గాని, తన భర్తను గాని పోషించే ఆర్థిక బాధ్యతను ఆమెపై మోపలేదు. ఇంకా స్త్రీ కూడు, గూడు, గుడ్డ వంటి సమస్త అవసరాలను, ఏర్పాట్లను చూడడం (కల్పించడం) భర్త విధి. ఇంకా స్త్రీ ఏ పురుషుని ఆధీనంలో లేదా సంరక్షణలో ఉంటుందో ఆ పురుషుడే ఆమె సకల అవసరాలను తీర్చే బాధ్యత కలిగి ఉంటాడు. ఒకవేళ స్త్రీ నిస్సహాయ స్థితిలో అత్యవసర పరిస్థితులలో బయటికి వెళ్ళి పనిచేయవలసి వస్తే (ఉద్యోగం చేయవలసి వస్తే) అది వేరే విషయం.

ఇంటి అవసరాలను, భర్త అవసరాలను దృష్టిలో ఉంచుకోవడం, తన సంతానాన్ని సంరక్షించడం. గర్భస్థ స్థితిలో శిశువు భారాన్ని మోయడం, శిశువుకు పాలుపట్టడం ఇంకా ఆ శిశువు ప్రతి విషయంపై దృష్టి సారించి సరైన శిక్షణ ఇవ్వడం, శిశువును పాలు తాగే స్థితి నుండి యవ్వన దశ వరకు చేర వేయడం. వాస్తవంగా సమాజంలో మహిళ  అసలు కర్తవ్యం ఇదే.

ఆ అనంత కరుణామయుడైన దైవం పురుషుల్ని శరీరదారుఢ్యం, బుద్ధివివేకాలతోపాటు బలశాలిగా సృష్టించాడు. ఈ కారణం చేతనే పురుషునిపై స్త్రీ అవసరాలను తీర్చే బాధ్యతను విధిగా చేయబడింది. దీనికి తదనుగుణంగా దైవం స్త్రీను దయ, కరుణ వంటి లక్షణాలతో సృష్టించాడు. స్త్రీ తన వైవాహిక జీవితాన్ని పురుషుని నీడలో గడుపుతుంది. ఆమె నడవడికలో సున్నితత్వ ధోరణి అవలంబించకపోతే ఆమె అన్ని వేళలా హృదయపూర్వకంగా మేల్కొలుపుగా, తెలివిగా ఉండకపోతే ఇంకా ఆమె తన భర్త సుఖసంతోషాలలో దుఃఖ సమయా లలో పాలుపంచుకోకపోయినట్లయితే, కుటుంబంలో కలతలు, కలహాలు పుట్టుకొచ్చి ఆమె వైవాహిక జీవితాన్నే ఛిన్నాభిన్నం చేస్తాయి. వైవాహిక బంధం అనేది ఎంతో సున్నితమైనది.

నేడు స్త్రీపై కుటుంబ బాధ్యతలతో పాటు ఇతర బాధ్యతల (ఆర్థిక వ్యవహారాల) భారాన్ని మోపడం ఎంత వరకు సమంజసం. స్త్రీకు అంత అవసరం  ఏం  వచ్చిందని ఆమె ఇంటి నుండి బయటకు వెళ్ళి పనిచేయాలి, సంపాదించాలి. ఇంట్లోకూడా పనిచెయ్యాలి. కాని పురుషుడు మాత్రం తనకు విధించిన బాధ్యతలను మాత్రమే తన పరిధిలో ఉండి నిర్వహిస్తున్నాడు.

నాకు ఈ విషయం చెప్పాలంటే చాలా బాధగా ఉంది. స్త్రీ తన ఇంటి నుండి బయటికి వెళ్ళి పని చేసే భారాన్ని తానే స్వయంగా తనపై నిలుపు కున్నది. బానిసత్వపు జీవితం నుండి (బానిసత్వపు కబంధ హస్తాల నుండి) స్త్రీ ఎప్పుడో విముక్తి పొందింది. కాని స్త్రీయే స్వయంగా తన తోటి స్త్రీల కోసం బానిసత్వపు జీవితాన్ని మరల వ్యాప్తిలోకి తేబోతోంది. ఇది ఎక్కడి న్యాయం.

మనమే స్వయంగా స్త్రీకోసం బానిసత్వపు జీవితాన్ని పునఃప్రారంభించాలను కుంటున్నాము. స్త్రీ తనపై మోయలేనటువంటి భారాన్ని ఆమెపై మోపు తున్నాము.

నాకు ఈ విషయం చెప్పాలన్నా చాలా విచారకరంగానే ఉంది. పూర్వ కాలంలో కూడా స్త్రీ ఓ బానిసగా చూడబడేది. మనం ఆమెపై మోపినంత భారం అప్పుడు కూడా నేడు మోపబడేది కాదు. ఇప్పుడు కూడా స్త్రీ తాను పురుషునికి బానిస అనే తప్పుడు భావనలోనే ఉంది. ఆమె దృష్టిలో స్వాతంత్ర్యం అంటే పాశ్చాత్య సంస్కృతి పోకడలలో లీనమై ప్రతీరంగంలో పురుషునితో పాటు సమానంగా వ్యవహరించబడాలి. పురుషునితో సమానత్వం అంటే ఏమిటి? పురుషుడు తన శరీర సహజత్వాన్నిబట్టి అతడు తన పరిధిలోనే ఉన్నాడు. కాని స్త్రీ ఏం చేస్తుంది. ఆమె తన సహజ స్వభావానికి విరుద్ధంగా అనవసరమైన భారాన్ని మోస్తోంది.

ఈ 20వ శతాబ్దపు అజ్ఞానపు పోకడలు స్త్రీ పురుషులిరువురిపట్ల తన ప్రభావాన్ని ఏవిధంగా చూపుతుంది? ఈ అజ్ఞానం వారిపై ఎటువంటి బాధ్య తల్ని మోపుతుందంటే దానివల్ల మానవ మనుగడకు వినాశనమే తప్ప మరేమీ లేదు. ముఖ్యంగా ఆ నిర్ణయాలు స్త్రీ గౌరవ మర్యాదలు, బాధ్యతలు, ఆమె నైపుణ్యం, సామర్థ్యంపై ప్రభావం చూపుతున్నాయి.

ఇక్కడ ఏం జరుగుతుందంటే ఈ కాలపు అజ్ఞాన పూరిత పోకడలు, మోసపూరిత అసత్యపు హంగామాలు మన చెవులను చెవిటిగా మార్చే స్తున్నాయి. 'మహిళాభివృద్ధి', 'మహిళ పట్ల న్యాయం', 'మహిళ మేల్కొలుపు' వంటి అసత్యపూరిత నినాదాలు చేసి మహిళల్ని మోసాలకు గురి చేస్తున్నాయి. ఇంత జరుగుతున్నా మీరు సమాజంలో మహిళ పాత్ర ఏమైనా ఉందా? అని ప్రశ్నిస్తున్నారు.

ఓ నా ప్రియమైన పాఠకులారా! మీరేం కోరుకుంటున్నారు. ముసుగులో

గుద్దులాట కాకుండా స్పష్టమైన, నిజమైన సత్యాన్ని తెలుపుతాను వినండి... సత్యం ఏమిటంటే...

మహిళను తిరిగి ఆమె స్థానంలోకే పంపించండి. అదే ఆమె కొరకు గౌరవనీయమైనది. దైవం దేనికోసమైతే ఆమెను సృష్టించాడో దాన్ని ఆమె సక్రమంగా నిర్వర్తించగలుగుతుంది.

వాస్తవమేమిటంటే, ఆ సర్వ సృష్టికర్త అయిన దైవం స్త్రీను ఓ మాతృ మూర్తిగా సృష్టించాడు. (ఆమె మొదటి స్థానం మాతృమూర్తి అయితే) ఆమె రెండవ స్థానం ఓ ఇల్లాలు. ఆమె ఓ మాతృమూర్తిగా, ఓ ఇల్లాలుగా ఉంటూ ఎంతో గౌరవమర్యాదలతో ఉన్నత శిఖరాలకు చేరగలుగుతుంది.

మాతృమూర్తి అనే పదానికి అర్థం ఏమిటో మీకు తెలుసా? మాతృ మూర్తి స్త్రీ పురుషులిరువురికీ నాయకురాలు. సృష్టికర్త అయిన అల్లాహ్ తర్వాత స్థానం ఆమెదే. అమ్మ అంటే జీవితాన్ని ప్రసాదించేది, సుఖసంతోషాలను కలుగజేసేది. ఏ జీవితంలో అయితే అమ్మా అనే భావానికి అర్థం ఉండదో ఆ జీవితం వ్యర్థం. ఎందుకంటే ఆ జీవితంలో సరైన మార్గం లభించలేదు, నరకమై పోతుంది. జీవితంలో వినాశనమైన ఆ నరకం నుండి రక్షించేది ఉత్తమమైన తల్లి మాత్రమే.

ఇప్పుడు నేను పురుషులను ఉద్దేశించి అడగాలనుకుంటున్నాను. సోదరులారా! ఇన్ని వాస్తవాలను తెలుసుకున్నాక కూడా సమాజంలో మహిళ వాస్తవమైన బాధ్యత ఏమిటి అని నన్ను ప్రశ్నించదలిచారా? (విచారించ దలిచారా).

నా మాటను ఆలకించండి! మహిళల బాధ్యత అతి ముఖ్యమైనది, మిక్కిలి సున్నితమైనది కూడా. ఆ సున్నితత్వాన్ని కూడా గుర్తించినట్లయితే ఎంత బాగుండేదో? ఇస్రాయీల్ ఎప్పటికీ మన భూభాగంలోని ఒక భాగాన్ని బాని సగా చేసుకునేది కాదు. గతంలో మాదిరిగానే అక్కడ స్వయంగా మనమే పరిపా లించుకునేవాళ్ళం.

ప్రవక్త(స) ఇలా ప్రవచించారు : "ఇద్దరు సొంత సోదరులు ఒకరికొకరు ఏవిధంగా సమానులో అదే విధంగా స్త్రీలు కూడా పురుషులతో పాటు సమానులే.'

వాస్తవంగా మనం ప్రవక్త(స)గారి ప్రవచనాన్ని ప్రముఖమైనదిగా భావించి దీని యదార్థాన్ని గుర్తించగలిగినట్లయితే మనకు స్త్రీ బాధ్యత పురుషులను (సమాజ సంస్కరణ కొరకు) తయారు చేయడం అని బోధపడేది. ఇంకా పురుషుల బాధ్యత ఏమిటంటే, వారు స్త్రీల కొరకు వారి సంతానం కొరకు ఇంకా వారి కుటుంబ సభ్యుల కొరకు సకల వసతులను, జీవనానికి కావాలసిన ఏర్పాట్లను కల్పించడం. తద్వారా స్త్రీకు సమాజ సంస్కరణ కోసం ఉత్తమమైన సంతతిని వృద్ధిలోకి తెచ్చే తీరిక, సమయం లభించడం ద్వారా ఓ పటిష్టమైన పరిపాలనా వ్యవస్థ తిరిగి వృద్ధిలోకి రాగలుగుతుంది. ఇంకా మనం ఈ జగతిలో దైవశాసనాల్ని పునరుద్ధించగలం, కార్యకలాపాలను, జీవన విధానాన్ని దైవం ఆదేశాలకనుగుణంగా మలుచుకోగలం. అన్నింటికి అతీతుడు, పరిశుద్ధుడైన దైవం ఇలా సెలవిస్తున్నాడు.

"నిస్సందేహంగా గౌరవ మర్యాదలు అనేవి అల్లాహ్‌కు, ఆయన ప్రవక్త(స)కు, విశ్వాసులైనవారికే చెందును." (సూరె అహ్‌జాబ్)

కాని నేడు ఈ సమాజంలో గౌరవమర్యాదలు ఎక్కడ మిగిలిఉన్నాయి. ఈ సమాజంలో సత్యమైన పాలన వ్యవస్థ ఉందా?

ఈ సమాజంలో సత్యానికి స్థానం ఉందా? నిస్సందేహంగా ఈ సమాజంలో సత్యానికి చోటు లేకుండా పోవడానికి బాధ్యురాలు ముస్లిం మహిళ. కాని నేడు మనం సమాజంలో స్త్రీ బాధ్యతల గురించి కర్తవ్యం గురించి ప్రశ్నించదలిచాము. కాని మనపై మోపబడ్డ బాధ్యతలను నిర్వర్తించడంలో సఫలీకృతమయ్యామా? కాని నేనే ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం ఇవ్వదలిచాను. నేనిచ్చే ఈ సమాధానమే సమాజంలో పేరుకుపోయి ఉన్న చెడుకు సరైన చికిత్స. స్త్రీను ఆమె అసలు స్థానంలోకి అంటే కుటుంబ జీవితంలోకి (గృహ

వ్యవస్థలోకి) పంపించండి. ఆమెకు ఆ స్థానమే గౌరవనీయమైనది, ఉన్నత మైనది. స్త్రీ ఆ స్థానంలో ఉండి తన జీవితాన్ని సమాజ సంస్కరణ కోసం ఉత్తమ మైన సంతతిని తయారు చేయడానికి వినియోగించగలుగుతుంది. ఆమె వారి బాధ్యతల పట్ల జాగృతపరుస్తుంది. మీరు వారిని అడగండి, ఓ సంతతి వినా శనం చెందడానికి మీరు సిద్ధమేనా అని. లేదా మీరు దైవాదేశాలకనుగుణంగా జీవితం గడపాలనుకుంటున్నారా? ఒకవేళ ఈ ప్రశ్నలకు సమాధానంగా వారు (పురుషులు) సమాజం వినాశనపు బాట పట్టే మార్గాన్ని ఎంచుకున్నట్లయితే స్త్రీ కర్తవ్యం ఏమిటంటే, ఆమె అలాంటి వారి (పురుషుల)తో దూరంగా మసలుకుంటూ, ఓ సంతతిని వినాశనపు బాట పట్టించే పనిలో నేను మీకు ఎటువంటి సహాయం చేయనని స్పష్టంగా చెప్పాలి.

సమాజంలో వినాశనం ఎందుకు ఉత్పన్నం అవుతుందంటే, ఆ సమాజంపై దైవకారుణ్యం అంతరించిపోతుంది. ఆ సమాజంలోని ఒక వర్గంవారు స్వలింగ సంపర్కానికి బానిసలవుతారు. ఇది మహిళ ఈ సమాజంలో తన స్థానాన్ని కోల్పోయిందని తెలిపే తొలి నిదర్శనం. ఇటువంటి సమయంలో మహిళ చేయవలసినది ఏమిటంటే, ఆమె ఇటువంటి సమాజాన్ని వదిలి తన నిజప్రభువు అయిన దైవం తెలిపిన మార్గంలో నడిచి ఓ నూతన సంతతిని వృద్ధిలోకి తీసుకురావాలి.

మీరు ఎప్పుడైతే ఇస్లామీయ సమాజంలో "మహిళ అతి ముఖ్యమైన కర్తవ్యం" అనే అంశంపై విశ్లేషణ జరుపుతారో అప్పుడే మీకు ఈ విషయం యొక్క వాస్తవం బోధపడుతుంది. ఈ సమయంలో మహిళ యొక్క అతిముఖ్య మైన కర్తవ్యం ఏమిటంటే, కుటుంబ వ్యవస్థలో (గృహ వ్యవస్థలో) ఆమె తల్లిగా, ఓ ఇల్లాలుగా తన జీవితాన్ని గడపడమేకాక తన సంతానానికి విద్యాబుద్ధులను, నైతిక విలువలను బోధిస్తూ ఓ ఉత్తమమైన సంతతి వృద్ధిలోకి తేవాలి. ఆ సంతతిలోని వారికి తమ జీవిత ముఖ్య లక్ష్యాలను గురించి పూర్తి అవగాహనను కలిగించాలి. ఇంకా తల్లి తన తల్లితో జీవిత ఉద్దేశం గురించి అన్వేషించాలి.

మహిళ, తల్లిగా తన సంతానానికి తన కర్తవ్యమేమిటో తెలపాలి.

నేను మీకు ఓ జాతి గాధను వినిపించడానికే బతికి ఉన్నాను. దైవం చేసిన చట్టాల ప్రకారం ఈ జగతిలో తన పరిపాలనను కొనసాగించింది. ఆ తర్వాత దైవచట్టాలను ఉల్లంఘించింది. ఆ కారణం చేతనే నేడు (ఈ సమాజంలో) ఈ పరిణామాలు ఉత్పన్నమవుతున్నాయి.

ఓ నా ప్రియమైన సుపుత్రుడా! నీవు నా మాటను శ్రద్ధగా ఆలకించు. నేను ఓ సమాజంలోని గొప్పతనాన్ని, ఆ సమాజంలోని న్యాయం గురించి విన్న విస్తాను. నీవు ఈ విషయాలను జ్ఞాపకం ఉంచుకో. నేను నీకు ఈ సమాజం యొక్క మొదటి పురుషుడని గురించి, ఆ యుగ పురుషుని జీవన విధానం గురించి తెలుపుతాను. నేను నీకు ఏదైతే విన్నవిస్తున్నానో దాన్ని నువ్వు శ్రద్ధగా ఆలకించి జ్ఞాపకం ఉంచుకో.

నేను నీకు ప్రియప్రవక్త ముహమ్మద్(స) గురించి తెలుపుతాను. ఇంకా ప్రియప్రవక్త(స) పాల్గొన్న యుద్ధ గాధల గురించి, ఆయన(స) అనుచరుల గురించి, ప్రియప్రవక్త(స) తర్వాత సత్యన్యాయాలతో పరిపాలన చేసిన వారి గురించి నీకు తెలుపుతాను. నేను నీకు ఈ విషయాలను గురించి వినిపిస్తున్నప్పుడు నీ చెవిలో అనేక పేర్లు మారుమోగుతాయి. అప్పుడు నువ్వు ఆ పేర్లను పిలుస్తావు. అప్పుడు నీకే అర్థమవుతుంది నీవు కూడా వారిలోనివాడివని, నీవు కూడా వారితోనే ఉన్నావని. ఇంకా ఆ రోజు నా కళ్ళలో ఆనందభాష్పాలు రాలుతాయి. అప్పుడు నీవు ఆ మహానుభావుల పేర్లను పిలుస్తు ఉండడం నేను గ్రహిస్తాను. నీవు స్వయంగా 'ముహమ్మద్(స) అల్లాహ్ ప్రవక్త అని, నేను ఆయననే అనుసరిస్తాను, ఇంకా ఆయన అనుచరులు నడిచినబాటలోనే నేను నడుస్తాను' అంటావు

అమ్మగారు! నేను వారందరిని నా ఊహాలోకంలో చూస్తున్నాను. నేను వారి ప్రకారమే నా జీవితాన్ని మలుచుకుంటాను. నేను వారి బాటలోనే నడుస్తాను. నేనప్పుడు నీతో ఇలా ప్రశ్నిస్తాను. నీవు ఎవరి గురించి మాట్లాడు

తున్నావని. అప్పుడు నీవు ఇలా అంటావు. నేను అబూబకర్ (రజి), ఉమర్ (రజి), ఉస్మాన్(రజి), అలీ(రజి)ల బాటలో ఇంకా ఎవరైతే రుజుమార్గంలో ఉన్నారో వారి బాటలోనే నేను నడుస్తాను. ఇంకా నీవు ఇలా అంటావు.

అమ్మా! నేను అతి త్వరలోనే ఖుల్ఫాయె రాషిదీన్ కాలం నాటి పరిపాలనా వ్యవస్థను వ్యాప్తిలోకి తెస్తాను. ఇంకా నేను ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ కాలం నాటి పరిపాలనా వ్యవస్థను వ్యాప్తిలోకి తెస్తాను. నేను మళ్ళీ చరిత్రను తిరగరాస్తాను. త్వరలోనే నేను టర్కీలో ఖలీఫాల నూతన చరిత్రకు నాంది పలుకుతాను. అబూ సూఫియా మస్జిద్‌లో నమాజ్ చేస్తాను. ఇస్లామీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తాను.

నేటి సమాజంలో తల్లి పోషించే పాత్ర ఎంతో సున్నితమైనది, కష్టంతో కూడుకున్నది. స్త్రీ పురుషున్ని కుటుంబ వ్యవస్థ నుంచి బయటికి తీసి బయటి ప్రపంచంలో పనిచేసే అవకాశాన్ని కల్పించాలి. ఇది అతి ముఖ్యమైన విషయం. ఇంకా స్త్రీయే స్వయంగా బయటి ప్రపంచంలోని విషయాలకు వీడ్కోలు పలికి, కుటుంబ వ్యవస్థ పరిధిలో కొత్త సంతతికి శిక్షణను ఇచ్చే బాధ్యతలను నెరవేర్చాలి. ఇది ఎంతో ముఖ్యమైనది. ఎందుకంటే, దీని ఫలితంగా పురుషులకు తమ సామర్థ్యాలను, నైపుణ్యాన్ని పెంపొందించుకునే అవకాశం లభిస్తుంది. జాతీయ ఉత్పత్తి పరిమాణం వృద్ధి చెందుతుంది. సరైన పద్ధతిలో, సరైన మార్గదర్శనంలో జరిగిన మానవ నిర్మాణం ఎంతోమంది మానవులకంటే లాభదాయకమైంది.

స్త్రీ తన సహజ స్వభావం వైపుకు మరలితే ఇంకా పురుషుడు కూడా తనపై విధించిన బాధ్యతలను నెరవేర్చినట్లయితే అటువంటి సమయంలో స్త్రీ తన సదాచారణ వల్ల ఓ పవిత్రమైన, ప్రసిద్ధమైన సమాజ నిర్మాణాన్ని చేపట్టడం మనం చూస్తాం. ఆమె ఆలోచనా విధానాల వల్ల సమాజంలో రోజురోజుకి వృద్ధి వికాసాలతోపాటు సమాజంలో ఓ పటిష్టమైన ధ్యేయంగల సంతతి వ్యాప్తిలోకి రాగలుగుతుంది. ఆమె చేసిన కృషి ఫలితంగా సమాజం ఆమె పేరును

కొనియాడుతుంది. ఆమె పట్ల ప్రేమతో మెలుగుతుంది. ఆమె కార్యాచరణకు సరైన గౌరవం ఇస్తుంది. దాని ఫలితంగా సమాజంలో మంచి మారుమోగుతుంది. సరైన రుజుమార్గం లభిస్తుంది. తుదకు ఓ చక్కటి పరిపాలనా వ్యవస్థ వృద్ధిలోకి రాగలుగుతుంది. అది ఖుర్ఆన్ (దైవశాసనాలనుసారం) పరిపాలనా విధానాన్ని కొనసాగిస్తుంది. ఇంకా అది ఖులఫాయె రాషిదీన్ అడుగుజాడల్లో నడుస్తుంది. ఇంకా ముస్లిం రాజ్యాలు, సమూహాల మధ్య సత్సంబంధాన్ని జనింపజేయగలుగుతుంది. ఇంకా వారి హద్దులు, వారి జన సమూహం, వారి బాధ్యతలు, విశ్వాసం, పరిపాలనా విధానం, వివేకం వంటి విషయాల పట్ల పూర్తి అవగాహన కలిగి ఉంటుంది.

సుగుణవంతురాలైన తల్లులు తమ సంతానం యొక్క పోషణ, శిక్షణ (సంతతి యొక్క నిర్మాణం కోసం అన్నివేళలలో ప్రథమ స్థానంలో ఉంటారు) కొరకు అన్నివేళలలో మేల్కొలుపుగా ఉంటారు. వారే సమాజ నిర్మాణం కోసం ఓ పటిష్టమైన నిర్మాణాన్ని చేపడుతారు. వారు ఆ నిర్మాణం యొక్క పరిరక్షణ కొరకు ఓ సుందరమైన పచ్చిక బయలును నిర్మిస్తారు. అది తన ప్రభువు యొక్క ఆజ్ఞతో ఎల్లవేళలా తన మేలైన ఉత్పత్తులను ఇస్తుంది.

ముస్లిం సమాజం అనేది మహిళ చేతిలోనే ఉంది. ఓ మహిళ చేతిలో అమానతుగా ఉంది. ఆమె ధర్మం, ఆమె బాధ్యతలు ఆమెతో ఇలా ప్రశ్నిస్తున్నాయి. అసలెందుకు మనం వెనుకబడి ఉన్నాం. ఇతరులెందుకు ముందుకు వెళ్ళగలిగారు? మనం ఇతరుల విధేయులమెందుకయ్యాము? ఇస్రాయీల్ వారు మనపై ఎందుకు దండయాత్ర (దాడులకు) దిగుతున్నారు? రష్యా అఫ్గానిస్తాన్‌లోని ధర్మ ఆనవాళ్ళను ఎందుకు అగౌరవపరుస్తుంది. ఈ అమెరికా దాని వయసు కేవలం రెండు వందల సంవత్సరాలు (అంటే అమెరికా ఆవిర్భంచి కేవలం 200 సంవత్సరాలు అవుతుంది) అసలెందుకు అది మనపై పెత్తనాన్ని చలాయిస్తుంది. అసలెందుకు ఇలా జరుగుతుంది? కాని మనం ఓ సంతతివారము. మన సంతతి ఆవిర్భవించి పదిహేను దశాబ్దాలు గడిచాయి.

మరి మీకు ఏ ప్రశాంత సమయంలో ఈ ప్రశ్నలకు సమాధానం లభిస్తుంది. లేదా ఆ దృశ్యపు గొంతు ఈ సమాజాన్ని మీ చెవుల్లో ఊదుతుంది. ఈ సమాధానం ఎంతో కఠినమైనది, ఆ సమాధానం ఏదో మీకు తెలుసా? వినండి ఆ సమాధానం ఇదే.

ఓ నా ప్రియ నేస్తం! నువ్వే ఈ సమస్త చెడులకు కారకురాలివి. నువ్వు నీ సంతానాన్ని ఏ స్థితిలో వదిలేశావు అంటే, వారి చెవులు సత్యాన్ని గ్రహించడంలో చెవిటివై పోయాయి. వారి కళ్ళు సత్యాన్ని కనడంలో గుడ్డివై పోయాయి. నువ్వే వారికి అనుమతినిచ్చావు, వారు ఆ విషపు ఆలోచనలకు బానిసలుగా మారుతున్నారు. అది కూడా టీవి ద్వారా వారి వరకు మనద్వారానే చేరుతుంది. కాని దౌర్జన్యపరులు, దుర్మార్గులైన యూదులు వారిని విషంతో నాశనం చేశారు.

నువ్వే ఓ నా ప్రియమైన మగువా, నువ్వే ఈ సమస్త చెడులకు బాధ్యురాలివి. ఎందుకంటే, నువ్వు మన ధర్మం అంటే, సరైన జీవన విధానానికి దూరంగా ఉన్నావు. ఎందుకంటే ఆ సమయంలో ఈ ధర్మం యూదుల ప్రయత్నాల ఫలితంగా వ్యర్థమైన మాటలు చేర్చబడి అశుద్ధమైనది. ఇప్పుడు అదే విజ్ఞానాన్ని నీ సంతానం ఆ ధార్మిక పాఠశాలలో అర్థిస్తున్నారు. ఈ సంతానం కొత్తకొత్త పేర్లతో ఉదాహరణకు సామాజిక మేల్కొలుపు, సామాజికాభివృద్ధి మొదలైన పేర్లతో చదువుతున్నారు. ఇవన్ని విషపూరితమైన అసత్యమైన పేర్లు. ఇవన్ని వ్యర్థ ప్రయోజనాల కోసం కల్పించుకోబడినవి. వాటిని షైతాన్ అలంకరించి ఆకర్షణీయంగా పుస్తకాల్లో లిఖిస్తున్నాడు.

ఇవన్ని అమెరికా యూదుల ఆలోచనా ఫలితాలు. దీని కారణంగానే 20వ శతాబ్దంలోని అజ్ఞానం మనంపై ఆవహించింది. దాని మూల్యంపై పాలస్తీనా వారికి అర్పించాం, ఒకటొకటి ఇస్తూ చివరికి మన ఇంటిని కూడా వారికి అర్పిస్తాము.

వాస్తవంగా ఈ మూల్యం చెల్లించడానికి కారణం స్త్రీని నాగరికత పేరుతో (ఆమె స్థానం నుంచి తొలగించి) కొత్త సంతతిని పెడదోవ పట్టిస్తు

న్నాము. నిస్సందేహంగా ఇది అజ్ఞానాంధకారం వైపుకు మళ్ళిస్తుంది. అసలెందుకు అలా జరగదు? నాగరికత పేరుతో ఎన్నో సంతతులు వినాశనం పాలయ్యాయి. ఇప్పుడు కూడా మనం మేల్కొలుపు వైఖరిని అవలంబించకపోతే, వాళ్ళను ఆమె స్థానంలోకి ఓ ఇల్లాలుగా (ఓ గృహిణిగా) పంపించకపోతే ఆమె ఓ కొత్త సంతతి నిర్మాణాన్ని చేపట్టవలదు. మన ప్రస్తుత పరిస్థితులను చూసి అర్థం చేసుకున్నట్లయితే మనం ఓ పెద్ద ప్రళయాన్ని ఎదుర్కోవడం కోసం సిద్ధంగా ఉండవలెను.

స్త్రీ తన బాధ్యతలను గుర్తించే సమయం ఇంకా ఆసన్నం కాలేదా? ఇంకా ఆమె తన పరిధిలో ఉంటూ సమాజ సంస్కరణ చేయాలి. పర్యవేక్షకురాలిగా నిరూపించుకోగలగాలి.

సమాజ నిర్మాణాన్ని చేపట్టే పురుషులను తయారు చేయాలి. వారు నిరంతర నిర్మాణదారులు కావాలి. ఇస్లాం వృక్షంలోని ఈ కొత్త మొక్కల వేళ్ళు ఎంతో పటిష్టంగా ఉంటాయి. దాని కొమ్మలు ఆకాశంలో వ్యాపిస్తాయి. అవి తన ప్రభువు అనుమతితో అన్ని వేళలా కాయలు కాస్తుంటాయి.

ముస్లిం మహిళ దైవగ్రంథం, దైవప్రవక్త(స) సంప్రదాయాన్ని అనుకరిస్తుంది. ఇంకా ఆమెయే రాబోయే తరాలను తీర్చిదిద్దేది. ఆమె ఎటువంటి సంతతిని వృద్ధిలోకి తెస్తుందంటే ఆ సంతతి యొక్క నినాదం 'అల్లాహు అక్బర్', 'అల్ ఇజ్జాతుల్ ఇస్లాం' వారు ఇంకా ఇలా అంటారు: అల్లాహ్‌కు కృతజ్ఞతలు. దైవం మాకు సన్మార్గాన్ని చూపించి సాఫల్యబాటలో నడిపించాడు. ఇంకా ఆయన వాక్కులు ఔన్నత్యాన్ని పొందుగాక, అవిశ్వాసులు వినాశనం పాలుగాక.

ఈవిధంగా ప్రతీది తన వాస్తవ స్థానంలోకి ఇమడగలుగుతుంది. స్త్రీ తన సరైన బాధ్యత వైపుకు మరలుతుంది. అంటే, సుప్రసిద్ధ మహిళలు, విశ్వాసుల మాతృమూర్తులు హజ్రత్ ఖదీజా(ర), హజ్రత్ ఆయిషా(ర), హజ్రత్ నసీబా(ర), హజ్రత్ ఫాతిమా బిన్తె ముహమ్మద్(స), అస్మా బిన్తె అబూబకర్(ర)ల జీవన విధానాల వైపుకు మరలుతుంది.

ఈవిధంగా సత్యానికి అసత్యంపై ఆధిపత్యం లభిస్తుంది. త్యాగాల శుభం వల్ల ఖర్చుచేయబడిన ధనంవల్ల వైరం, విద్వేషం, వైషమ్యం అంతమవు తుంది.

నిస్సందేహంగా మహిళకు ఇవ్వబడిన బాధ్యత అత్యంత కీలకమైనది, ఆమె ఎటువంటి ఆచరణను చేపట్టాలంటే దాని ఫలితంగా సమస్త ముస్లింలలో విభేదాలు విచ్ఛిన్నాలు దూరమై వారంతా ఒకే (సంఘం) వృక్షంలా ఎదగాలి. ఆ వృక్షం వేర్లు అత్యంత దృఢంగాను, ధాని శాఖలు నింగికెదగాలి. అది తన ప్రభువు ఆజ్ఞతో ఎల్లవేళలా తన ఉత్పత్తులను ప్రసాదించాలి.

ఇప్పుడా వృక్షం అనేది 'లాఇలాహ ఇల్లల్లాహ్' మాత్రమే. దీని యొక్క నిగూఢార్థాన్ని గ్రహించినప్పుడే ఉమ్మతె ముస్లిమ ఖుర్ఆన్, ప్రవక్త(స) సాంప్ర దాయం ద్వారా వెలుగును విరజిమ్ముతుంది. ఇస్లామీయ పరిపాలనా వ్యవస్థను పునరుద్ధరించగలుగుతుంది. తద్వారా జగతిలోకి ముస్లింలంతా ఒకే సంఘంగా ఏర్పడతారు. చివరకు ముస్లింలంతా ఒకే సంఘంగా ఏర్పడి ఒకే పరిపాలనా వ్యవస్థను కలిగి అందరూ ఐకమత్యంతో ఏకమవుతారు.

ఇదే హిజ్రి శకం 15లో ముస్లిం మహిళలు పోషించిన పాత్ర. ముస్లిం మహిళయే స్వయంగా తన పుత్రులకు ఉమ్మతె ముస్లిమా యొక్క లక్షణాలను తెలుపుతుంది. ఈ విధంగా గతంలో ఉత్పన్నమైన తప్పులను, పొరపాట్లను గురించి అవగాహనను కలిగిస్తుంది. ఈవిధంగా మహిళ తనపై మోపబడిన బాధ్యతలను నిర్వర్తించాలి.

ఎందుకంటే మహిళ సమాజానికి మాతృమూర్తి, నాయకురాలు. ఈ విషయాలను గ్రహించినప్పుడే మహిళ తన కార్యచరణ సక్రమంగా సాఫల్యంగా పూర్తి చేయగలుగుతుంది. ఓ ఉన్నతమైన ఇస్లామీయ సమాజం వ్యాప్తిలోకి వస్తుంది. అది ఖుర్ఆన్, దైవప్రవక్త(స) సంప్రదాయం ప్రకారం నడవగలుగు తుంది. నిస్సందేహంగా ముస్లిం మహిళ అత్యంత శ్రేష్టురాలు.

(ఈ విషయాల్ని జైనబుల్ గజాలి డిసెంబర్ 4, 1985లో ఇస్లామా బాద్‌లో నిర్వహించిన మహిళల చరిత్ర అనే అంతర్జాతీయ కాన్ఫరెన్స్‌లో వ్యాఖ్యానించారు.

"మేరి బాత్ గౌర్‌సే సునియె' అనే చిరు పుస్తకంలో జైనబుల్ గజాలి 'నవ సమాజ నిర్మాణంలో మహిళ పాత్ర' అనే అంశాన్ని విభిన్న కోణాల్లో విశ్లేషించారు. మహిళ తన సహజ కర్తవ్యాన్ని విస్మరించడం వల్లనే నేడు సమాజంలో ఇటువంటి దుస్సంస్కృతి చోటుచేసుకున్నది. ఎప్పుడైతే మహిళ పాశ్చాత్య సంస్కృతి ముసుగులో ఉన్న సమానత్వ భావాలను వీడుతుందో ఇంకా తన సహజ ధర్మం, గృహ వ్యవస్థ సంస్కరణను చేపడుతుందో అప్పుడే నవసమాజం కొత్త పుంతలతో ప్రారంభమవుతుంది. ఈ నూతన సమాజంలో ఎక్కడ చూసినా శాంతి సామరస్యాలే వర్ధిల్లుతాయి.

నవీన నాగరికత విధానాలు మహిళపై రెండు బాధ్యతలను మోపు తుంది. 1. కుటుంబ బాధ్యత 2. ఆర్థిక బాధ్యత. ఈ ఆర్థిక బాధ్యతల వల్ల స్త్రీ తన సహజ స్వభావానికి దూరంగా ఒదిగిపోతుంది. తద్వారా కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నం అయి అనేక సంఘర్షణకు దారితీస్తుంది. కాబట్టి మహిళను ఓ మాతృమూర్తిగా, ఓ నాయకురాలుగా, ఓ నవ సమాజ నిర్మాతగా గుర్తించాలి. ఆమెను ఆమె సహజ కర్తవ్యాన్ని నెరవేర్చడానికి సకల విధాల కృషిచెయ్యాలి.

అయితే సమాజంలో నేడుమహిళ స్థానం ఏది? ఆమె ఏ స్థానం నుండి ఏ స్థానానికి చేరుకుంది. దాని పర్యావసానం ఏం జరుగుతుంది? నవ సమాజం ఏర్పడాలంటే, సమాజంలో శాంతి సామరస్యాలు నెలకొనాలంటే అందుకు మనం ఏం చెయ్యాలి అనే విషయాలను తెలుసుకోవాలంటే ఈ చిరు పుస్తకం చదవవలసిందే.

